భీమ— ఆహా! దైవమా! తుదకు రాజపుత్రస్త్రీలకిట్టి దురవస్థను నగూర్చెదవా? రసపుత్రయోధులారా! చిట్టచివరకీ చిత్తూరు రాజ్యలక్ష్మి కెట్టి దుర్దశ రానున్నది' (తనలో) ఇక్కట్టున పాదుపాకు బాదాక్రాంతుండవైన— (పరిహాసముగా) చిత్తమా! యేమనుచుంటివి! యెల్లను మనకు యుద్ధంబు తప్పదు. బాదూలుసింగ్! నీవు సైన్యముల నాయత్తపఱచుము. రసపుత్రులారా!

తే॥ గీ॥ ప్రాణములపైని భీతిని బారఁద్రోలి
పోరుఁడీ మీరలాహవ భూమియందుఁ
బడిన మీయందు నొక్కఁడేవఁడును వారి
లందుఁ బదుగురు నెక్కొరూఁడ యవనిఁ బడరె?

తే॥ గీ॥ యెదురుగా మృత్యుదేవత యెదవుచున్న
దనుచు వెనుదీయకుండి యుద్ధమందు మూల
దాగినను మృత్యుదేవత తప్పగలదె?
వీరవరులార! రసపుత్రశూరులార!

ఇక సత్వరము మీరెల్లరు యుద్ధసన్నద్ధులై యుండుఁడు.

(నిష్క్రమము)

ద్వితీయరంగము:— సమరరంగ సామీప్యప్రదేశము.

ప్రవేశము:— భీమసింగు.

భీమ—

చ॥ మనసు కలంగ సాగెను బ్రమాదము సంభవమౌనో యిప్డు నా
కనులకు నెల్లవస్తువులు కాంతివిహీనము లౌచునుండె న్నా

తనయులఁ దల్చినప్పు డమితంబగు సందియ మొందుఁ గల్గుచుం
డెను రణరంగమున్ విడిచి నేనిట వచ్చిన దాది యేలొకో! ॥

సీ॥ భూమ్యంబరంబులుఁ బొరలుచు రక్తసి
 క్తములైన యట్లు నేఁ గంటి నిపుడు
దశదిశలను బ్రతిధ్వను లెసంగిన యట్లు
 చిత్తంబు దిగ్భ్రమాయత్తమయ్యెఁ
దరుసమూహము లెల్ల సరిపీరులై తల
 క్రిందుగా నడచు నట్లిందుఁ దోఁచెఁ
బలుమారు వారిజాక్షుల రోదన ధ్వనుల్
 శ్రవణకుహరములఁ బ్రబలమయ్యెఁ
తే॥ గీ॥ ప్రళయదావాగ్ని యెల్లెడఁ బ్రజ్వరిల్లి
 సకలమును దగ్ధమొనరింప సాగినట్లుఁ
 దోఁచె మిన్నేదో మన్నేదో తోఁచ దిప్పు
 డివ్విధం బంతకును హేతు వేదియగును.

(ఆలోచించి) నేను దక్షిణవైపు కోటకొమ్మలను గాపాడుచుంటినే! ఈనిర్జనసీమ కెట్లు రానయ్యెను? (యోచించి) రిపుసైన్యధాటీ పలాయితుండనైతినా? అట్లేలనగును? యేదియో విషయము నాలోచింప వచ్చితిని. (ఆమ్మసంజే యుడి) హృదయమా! యేమనుచుంటివి! "దుర్గంబు తురకల కధీనంబైన నీవేమిచేయఁగలవాడ" వనియా? ఆ! ఏమి! దుర్గంబు మ్లేచ్ఛులకా యధీనంబగుట? అట్లెన్నండును సంభవింపదు. (ఆలోచించి) జయాపజయంబులు దైవాధీనంబులు గాన నొకవేళ నట్లైన చిత్తూరు రాజ్యలక్ష్మి పరాధీనంబైన నేమిచేసెదను? రసపుత్రశూరులు తురుష్కులను కోటలోనికిఁ బ్రవేశింప నిత్తురా? భానుకులప్రదీప్తు లెల్లరును రణనిహతులైన గదా శత్రువులు దుర్గమును వశపరచుకొనుట! ఒకవేళ నట్లెల్లరు సమరమందు సంఘమరణము నొందిన రాజపుత్రస్త్రీల కెల్లర కా తురుష్కులచే. మానభంగంబు సంభ

ల్లగలదా. ఔరా! రిపుపుత్రస్త్రీలకు మానభంగంబు చేకూరునుగా?
వారియెడ మానభంగింబుఁ దలపెట్టుట మండుచున్న దావానల
జ్వాలలను బిగియారఁ గౌగిలింప జూయుంజనునట్లగదా.

(తెరలో)

ఉ॥ దక్షిణదిక్కు కుడ్యములు ధారుణిఁ గూలఁ దొడంగె శాత్రవా
ధ్యక్షులు కోటగోడలఁ బ్రయాసముతో నెగబ్రాకు చుండె రా
దక్షిణ దిక్కుకుడ్యములఁ దా నతిధీరతఁ గాచు భీమహ
ర్యక్షము సంగరంబున విహార మొనర్చుట లే దదేలొకో?

భీమ——(ఆలకించి) ఏమీ! దక్షిణదిక్కు!! ప్రాకారంబులు సంరక్షించు
చున్న నన్నుఁ గూసకసైనికులిట్లు బలుకుచుండిరి. నే లేకుండుటఁ
జూచి యాతురుష్కులు ప్రాకారంబులమాపు మాపఁ గడంగిరి.
ఓరోరి తురుష్క సైనికులారా! యిదియే వచ్చుచుంటిని.
ఇఁక మీప్రయత్నములు సాగవుసుమా. (అనికత్తినెత్తి క్రింద
వైచి నిర్విణ్ణుండై)

చ॥ బలరిపుమస్తకంబుల సభస్థలిపై కెగయంగ కంధరం
బులఁ దెగ వ్రేయుచో నయినఁ బోరున మత్తగజాళి తుండముల్
దలఁపక కోయుచో నయినఁ దగ్గరఁ గాంచుక యోని మద్భుజా
బలమది యిప్పుడిట్లు కరవాలము నెత్తఁగఁ జాలదయ్యెనే!
ఇవ్విధి మదీయదోర్బలం బెల్లఁ దరిగెనా! లేక

చ॥ సమరమునందు శాత్రవులఁ జక్కగ నుగ్గొనర్పకిట్లు డెం
దమున మహత్త్వసంగతిని దల్చుచు మిన్నక కూరుచుంటి నీ
సమయమునందు గాన "నికఁ జాలు యశో"స్సని తేగి ఖడ్గర
త్నమ నను వీడ నెంచితివె? దాసుసతప్పులు కావు మిత్రరిన్.

(కూర్చుండును)

ప్రవేశము:—పురదేవత

పుర— భీమసింగ్జీ! భీమసింగ్జీ!

భీమ—(దిగ్గున లేచి) ఎవరు నన్నుఁ బిలిచినది! (పురదేవతను జూచి యంజలిబద్ధుండై)

ఉ॥ ఆలముసం జరించి భయదాకృతిఁ దాల్చిన భూతిరాజ్ఞివో!
కాలవశంబునం జనులఁ గాలునిపాలికి సంపు దేవివో!
వేలకొలంది శౌర్యకలితుల పెంచిన యీ పురలక్ష్మివో! యికన్
గాళివొ! నీపదాంబుజయుగంబునకు బ్రణమిల్లెదన్ వెసన్॥

(మ్రొక్కును)

పుర—రవికులపుంగవా! నే నెవ్వతెనైన నేమి? మదభీష్టంబు సిద్ధింపఁ జేసెదవా?

భీమ— (తనలో) చూడఁజూడ నీమె పురదేవతయని స్పష్టమగుచున్నయది. (ప్రకాశము) తల్లీ! భవదీప్సితం బెయ్యదియో యెఱింగించిన నాశక్యమగునేని యొనర్చెదను.

పుర—భీమసింగ్! మన్మనోరథం బెట్టిదైన నేమి? యొనర్చెదవా?

భీమ—జననీ! భవదీప్సితం బెఱిఁగింపకున్న నెట్లు ప్రతిజ్ఞఁ జేయఁగలను? ఎట్టిదియో యెఱిఁగింప బ్రార్థించుచున్నవాఁడ.

పుర— రాజోత్తమా! సూర్యకులంబున కంతకును గీర్తికపుఁ దెచ్చుచుంటివి! నావాంఛితం బెట్టిదియో యెఱింగించినట్లయినఁ దమ చేతనగునట్లు సమకూర్చువా రెందరు లేరు? నేను నీయొద్దకే రావలసినయవసరమే మున్నది? నాకోరిక నెఱవేర్చెదవా? లేకున్న నింకెవరికడకైనఁ బోయెదను. (పోఁబోవును)

భీమ— తల్లీ! తల్లీ! ఈ సేవకుమానునిపైఁ గరుణ వహింపుము.

క॥ విలసిల్లెడు రాజ్యంబో
వెలగలభూషణములో, సువేసనలో, కో
పిలలో భవదీప్సితములు
తెలియంగాఁ జెప్పుము నాకు దేవీ! యుపహారా.

పుర—కుమారా! నీవు జెప్పినవానిలో నేదియును గాదు. నేఁ గోరునది నరబలిగదా.

భీమ—జననీ! నరబలియా? అందుకనేమి తక్కువైనది? జరుగుచున్నది మహాసంగరము కదా?

పుర—అయిననేమి?

భీమ—మనసునకుఁ దృప్తియగునట్లు నరులు దెగుచునే యుండిరి. అందారగింపఁగూడదా?

పుర—కుమారా! నేను ప్రేతభూముల సంచరించు భూతపిశాచవర్గములోఁ జేరియుంటిననియా నీ యభిమతంబు?

భీమ—అట్లయిన నోమాతా! నోరులేని జంతువుల బలి నొసంగుట నా యధీనముగాని నేను నరపాలకుఁడనైన మాత్రమున నస్మద్దేశమునందు సమానహక్కులతో జనన మొందినవారిలో నేరిని నీకు బలిసేతును? నేను నరపాలకుఁడఁగాని నరహంతకుఁడఁ గానుగదా. నాదేహముపై మాత్రము నా కధికారముగలదు. నన్ను నీ కత్తి కెఱగాఁ జేసికొని సంతృప్తి నొందుము.

పుర—భీమసింగ్జీ! వృద్ధాప్యంబు సమీపించిన నిన్నారగించిన నాకేమి తృప్తిగల్గును. నా కొకరిద్దరు గారు. పదునొక్కండ్రు గావలయును. కావున నీకుమారులలో పదునొక్కండ్రను బలినిమ్ము.

భీమ—తల్లీ! నాకుమారులనే కోరితివా! (ఆలోచించుచుండును.)

పుర—భీమసింగ్జీ! తడవయ్యెను. మరల నే నెల్లి దర్శనంబిత్తు.
(నిష్క్రమణము.)

భీమ—ఏమిా! ఇది కలయా! నిక్కవమా? నిక్కవముగా౯ బుర దేవతయే ప్రసన్నంబైనదా? (ఆలోచించి) ఆహా! నిజముగా నాదేవియే ప్రసన్నంబైనది. ఔరా! ఆమె నా కుమారులలో పదునొక్కండను గోరెనుగదా! రణభూమియందు వారలగతి యెట్లున్నదో?

ప్రవేశము.—శూరసింగు.

భీమ—శూరసింగ్జీ! రణభూమినుండి వచ్చితివిగదా! అందలి విశేషంబు లేమి?

శూర—మహారాజా! యుద్ధభూమియందలి సమాచారంబు సేవకుఁడు నుడువగలను. నాడర్ధరాత్రంబునం అక్బరు సకలసైన్య సమేతుడై యాకస్మికంబుగ దుర్గంబును ముట్టడించి మాసత్రయమునుండియు దానిని వశపఱచుకొనవలెనని బహువిధ ప్రయత్నంబు లొనరించుచున్నాఁడు. ఇట్లుండ నతం డశేషసైన్య సంధానంబులతో నరుదెంచి ప్రథమమునం బదునైదు దినములవరకును నంభోరాశికెనయగు నగడ్తను బూడ్చ యత్నించి యెట్టకేలకు సఫలీకృతమనోరథుం డయ్యెను. ఆట్లమ్మహాకార్యము నిర్వహించుకొని తదనంతరము దుర్గంబున కే దెసం జూచినను నాలుగుగడియల దూరమువరకు వ్యాపించియున్న చతురంగబలంబును, హయహేషధ్వనులును, గంధగజఘీంకారంబులును, భేరినినాదంబులును, దిగ్గజంబులదలంగ మ్రోగు గుణధ్వనులును గల్గి చూపరుల కపరిమితానందభయదాయకంబై యంభోనిధు లొక్కపెట్టునం బొరలి చిత్తూరుదుర్గమును ముంప వచ్చెనో యనునట్లు రసపుత్రశూరశిఖామణులకెల్ల

దక్షిణవైపు ప్రాకారంబులఁ గూల్పఁదలఁబడిరి. అచ్చట నియమింపబడిన శూరాగ్రేసరుం డేలోకో యుండు లేకపోవుటచే శాత్రవు లొక్కసారి దలఁబడి గోపురం దగ్ధభాగంబుల నిర్మూలం బొనరించిరి. ఇత్తెఱంగంతయు నవలోకించి భవత్పుత్రులు పదునొకండ్రును అర్ధనిర్మూలంబులైన కుడ్యములపై నిలచి ధనుర్విద్యాకౌశల్యము సార్థకంబగునట్లుగాఁ దురుష్కసైన్యనాయకుల నెల్లఁ గృతాంతు నికేతనంబున కంపి తుదకు కుడ్యంబు లాకస్మికంబుగఁ గూలుటచేఁ గ్రిందికి లంఘించి కత్తియుద్ధం బొనరించి శత్రువీరుల ననేకులఁ జంపి తామును కీర్తిశేషులైరి.

భీమ—— హా! పుత్రరత్నములారా!

మ॥ జననంబాదిరి ద్వాదశాబ్దములవరకున్ సంగ్రామరంగంబునన్
దనువుల్ బాసిరి మీ చిత్తోడ్పురిని స్వాతంత్ర్యంబు నిల్పంగ; నా
కు నితాంతప్రియుఁడైన తమ్ము నొకనిన్ శ్మశానస్థలిన్ స్వేడి మా
కనిశంబున్ ఘనదుఃఖనీరధిని నాకీ ముల్లు చేకూర్చియున్॥

హా! వరతనూజులారా! తుదకు సంగరము మీ భంగపాటునకే సంఘటించినదా! నిత్యము భిక్షాటనంబు సల్పి జీవించు నేగర్భదరిద్రునికైన జనించిన నిట్టి రణమరణంబు నొందకుందురుగదా! అష్టైశ్వర్యంబులుఁ గలవారలింట జన్మించి యల్పాయువు లయిన నేమి ప్రయోజనము? జననీ జనకుల కిట్టి పుత్రశోకం బిడుటకేగదా.

చ॥ కనుపెదు బిడ్డలం గని యకాలపు మృత్యువువాతఁ ద్రోయఁగాఁ
గడఁగి మిముల్ రణంబున దగన్ రిపులన్ వధియింపఁ బంపితిన్
జడుఁడ శ్వపాకుఁడన్ సుతుల చావునుగోరిన పాపకర్ముఁడన్
కొడుకులు! నాపయిన్ మిగులఁ గోపముఁ బూనకుఁడయ్య వేఁడెదన్॥

రంబుల దాఁటివచ్చు తురుష్కులను శిలాప్రవర్షంబులచేతను, సలసలకాగుసూనెచేతను యమసదనమున కంపిరి. అవ్విధంబునఁ దామొనర్చు సాధనంబులన్నియు వ్యర్థంబులౌటం గని తురుష్కనాయకుండొకింతయు మఱలక దూర్పువైపుననుండు కుడ్యముల ధ్వంసముఁ జేయ నుద్యమించెను. అవియును నిర్మూలంబైన నిఁక దుర్గమును రక్షించుట దుర్లభంబని తలంచి రసపుత్రసేనలన్నియు నత్యాతురతతో దక్షిణవైపు రక్షించుట మాని తూర్పువైపున కేగెను. అంత రణజిత్ సింగు స్వల్పసైన్యముతోనే యరివీరుల నెదుర్కొని ఘోరముగాఁ బోరుచుఁ గొంతవడికి విపక్షులచే నిర్మూలింపఁబడిన సైన్యంబును జూచి యొక్కింతయు భీతిఁ జెందక కత్తిని డాలునుఁ బూని తెగబడి రిపుల ఖండింపఁ జొచ్చె. అత్తఱి రణజిత్ సింగుకరవాలధారాకరాళమైన తురక సైనికులును, శుండాలంబుల తుండంబులును నిన్నియని యెన్న శక్యంబుగాదు. ఇవ్విధంబవలోకించి నాజరుజంగు క్రోధాంధీభూతచేతస్కుండై యెవ్విధంబున నైన నా రణజిత్ సింగును రణనిహతునిఁ జేయ నూహించి తానును గత్తియు డాలును ధరించి రసపుత్రయోధాగ్రేసరునితో ద్వంద్వయుద్ధంబునకుఁ దలపడెను. ఇట్లు రసపుత్ర తురుష్కవీరవరు లిరువురును సింగంబులపగిది బోరుచుండ నుభయ సైన్య సంఘంబును సంకుల యుద్ధంబు నాపి చిరకాలములకుఁ జూడఁగల్గిన యీ ద్వంద్వయుద్ధంబు నత్యంత కౌతూహలంబున వీక్షింపుచుండిరి. తురుష్కులు ప్రాకార నిర్మూలనము మానిరి. రసపుత్రులు తద్రక్షణ మాపిరి. అట్లాయిర్వురు కొంతకాలము పోరిన పిదపఁ దురుష్కయోధుండొక్కింత యలసినట్లుదోచిన మ్లేచ్ఛసైనికు లెల్లరు నాతనికిఁ బ్రోద్బలం బొసంగుచుండిరి. మనసేనలు రణజిత్ సింగు విజయోన్ముఖుండగు నని నిశ్చయించి బిట్టుబిట్టు ద్రిప్పబడుచున్న

ప్రవేశము:— బాదూల్ సింగు

భీమ— బాదూల్ సింగ్! సమరభూమిని బాసివచ్చితివేల?

బాదూల్— రాజా! రాకేమున్నది?

ఉ॥ వ్యర్థములయ్యె బాణములు వ్యర్థములయ్యె శిలాప్రవర్షముల్
వ్యర్థములయ్యె సాధనము లన్నియుఁ గూలెను గోడలెల్లనో
పార్థివచంద్రమా! మనకు వచ్చెను నాశనకాల మక్కటా!
వ్యర్థము నిక్కువంబుఁ బురుషార్థము లెంచకఁ గదనంబుఁ జేసినన్॥

ఇకఁ దురుష్కు లెట్టును దుర్గమందుఁ బ్రవేశించుట నిశ్చయము. కావున మనము శత్రుసేనలతోఁ దలపడి ప్రాణములపై నాసను వీడి పోరుట తథ్యము.

తే॥ గీ॥ జయము నొందెదమో లేక సమరభూమి
జచ్చి స్వర్గంబు నందగలార మేమొ
కాన జయమంది నిర్జిత ఘనయశంబు
వచ్చు; గాకున్న మనస్త్రీలు పరిభవంబు
నందగలవారు రిపులచే నిందు నధిప!

అట్లు విపక్షులచేఁ బరిభవానలసంతప్తలు గాకుండ మనరాజపుత్రస్త్రీల రక్షింపవలయు.

భీమ— బాదూల్ సింగ్!

తే॥ గీ॥ తురకనాథుని కోడి చిత్తూరునందు
మనస్వాతంత్ర్యము విడనాడి మనుటకన్న
విజయమందిన సరె; లేక విఫలమైన
యొడలఁ జత్తుము సమరమున నెల్లమేమును.

ఇది ముమ్మాటికిని సత్యంబు ఒకవేళ మనమెల్లరము రణనిహ

దనుపుము; రాజ్యమేలగను దక్కెతి నీవు సుమీ యొకండవే
ఘనముగ నెన్నఁడేని రిపుగర్వ మడంచి యశంబు నొందుచున్
కుమారా! అజేయసింగ్జీ!

ఉ॥ నీ విపు డీ కుమారకుని నెయ్యమునం గనఁ గాచిపోలు వేగ నా
నావిధ దుర్గమోగ్రవిపినంబులచేఁ బరివేష్టితాలయం
బై నిలుసిల్లుచుం బవసమృగావళికిన్ నిలయంబునైన యా
రావళిపర్వతంబులఁ గరంబు సుఖంబుగ నుండుము డీస్వరున్॥

ఉ॥ అన్నకుమారుఁ డంచితనియంతఁ దొరక నింతయు నీర్ష్యనూన క
త్యున్నతసత్కృపాపరిమితోజ్జ్వలభాసముఁ బూని యాదుదా
పన్నుల భీతిఁ దీర్పఁగల పంకజనాభుని మీఁద భక్తిసా
యన్నగిపంక్తులందు తనయా! మన బాలుని పెంచు మిమ్ముగన్॥

అజే—జనకా! మీ రెల్లరును సమరమునఁ వీరస్వర్గంబునొంద నే నొక్కం
డ నశేషబాధుజాలంబునకై శోకించుచు మనఁగలనా?

భీమ—కుమారా! నా పలుకు లాలింపుము. నీవిందుల కంగీకరించవేని
కడు: బిన్నవయస్కుండగు నీబాలుని బోషించువార లెవ్వరు?
కావున మదాజ్ఞ శిరసావహించి చిత్తూరురాజ్యహితార్థ మట్లొన
రింపుము.

అజే—అట్లే మీయాజ్ఞానుసారమున ప్రవర్తింతును.

విక్ర—అజేయసింగ్జీ! ఆజ్ఞను శిరసావహింతువు గాని,

సీ॥ అప్పుడప్పుడు తప్పటడుగు లేయుటెఁ గాని
తోడిబాలురఁ గూడి యాడలేఁడు
మాధుర్యమౌ ముద్దుమాటలాడుటెగాని
పల్కరించిన మాఱుపల్కలేఁడు

కడుఁగూర్మితో తల్లి యంకమున నుంచుకొనఁగాని
దాసీజనంబుల దరికిఁ బోఁడు
అంతిపురమున స్వశాంత మూసుకొనుటగాని
కానఁ డాదిత్యుని కాంతి నెపుడు
తే॥ గీ॥ చారుసుకుమారహస్మ్రధా కోరసముని
నీకుమారుని క్షుద్రమృగాకులంబు
నైన విజన కాంతారమునకు నెట్లు
చేర్చి మెలఁకువఁ డఁ బోషింపఁ గలవో!

భీమ— బాలకా! పాత్రరత్నమా!

సీ॥ మోహనాకారులఁ బోషగన్న భయమందు
నీవు భిల్లుల జూచి నిలుచు టెట్లొ
డిబాలుర గాంచి యాడజంకెడు నీవు
వనమృగంబులమధ్యఁ బరగు టెట్లొ
మలయమారుతమున నిలువఁజాలని నీవు
ఝంఝూనిలంబును సైచు టెట్లొ
హంసధ్వనిని విని యదిరెద వీవు సిం
హేంద్రనాదముల సహించు టెట్లొ
తే॥ గీ॥ కన్నడలపాలు సేయ నిన్ గహనములకుఁ
బంపుచుంటిని భూధవపాంసనుండ
శ్రీప్రదం బగు రాజ్యాభిషిక్తుఁడ వయి
వెలయు మెపుడేని తురకల బల మడంచి.

విక్ర— తండ్రీ! సూర్యవంశోద్ధారకా!

సీ॥ క్రూరమదేభశార్దూలాదిమృగములే
యాటబాలకులు నీ కగును సుమ్ము
గాఢాంధకారసంగతమహాగ్రగుహాంత
రంబులే నీకు సౌధంబు లగును

సకలకళాపూర్ణచంద్రుండవుఁ దేజోని
ధియు నీకు ననిశంబు దివ్వెలగును
గహనసంచారశృంగార విపినదేవ
తలె నీకుఁ క్షేమునిత్తల్లులగుదు

తే॥ గీ॥ సింహపితృశ్రీయే [illegible]ను నీకు గురువు
వివిధశస్త్రాస్త్రవిద్యాప్రవీణుఁ జేయఁ
గలఁడు నిన్నతఁ డెల్లని కడఁగి మీస్వ
తంత్రరాజ్యంబు నేలుము తనయ! నిన్న.

లక్ష్మ— బాలకా! నాపలు కాలకింపుము.

తే॥ గీ॥ ఇఱుపవాదల యేబదియైన వత్స
రములు పూఁచియు మీవాడ్ స్వరాజ్య మేలు
చుండ్రి రసపుత్రు లీవంశ నొంటికుండ్రి
దైవవశత మ్లేచ్ఛులకు నెయ్యఁదలఁచి రగ్గి॥

బాదూల్— బాలకా! ఒక్కపర్యాయము బీచిత్తూరుదుర్గంబునుగన్ను లారఁ గనుము.

చ॥ సకలకళావిహీనుఁడగు సత్పతి తన్ను బరిత్యజించి యుం
కొకనివశంబుఁ జేయఁగలఁడో యని వెంగెముసొందు గుందు నా
వికచపయోరుహాస్యవలె వే కనుపట్టు చిత్తూర్ పురంబు నీ
వకట! కనుంగొనంగలిగి తౌరకుమారక! యెట్టకేలకున్.

భీమ— లక్ష్మణసింగ్జీ! రాజపుత్రశూరులారా! ఈబాలుని మీవాడ్ రాజ్యంబున కంతకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెద. ఇందులకు మీయభిమతం బేమి?

లక్ష్మ— మహారాజా! మీయభిమతంబే మాయభిమతంబు. సత్వరమట్లొనరింపుఁడు.

భీమ — (బాలుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి యాతనిశిరంబునఁ గిరీట ముంచి) బాలకా!

తే॥ గీ॥ అస్త్రశస్త్రాది విద్యల నన్ని నేర్చి
కరకుతురకలగుంపుని సంగ్రామమందుఁ
దుంచి యశమునుగాంచి చితూరుపురంబు
పరిపాలనము చేసి "బాపావాడ్" రమణ॥

(ఆ జయసింగువైపు దిరిగి) కుమారా! ఆ జయసింగ్! ఈ బాలుని పట్టాభిషిక్తునిఁ జేసితిని.

సీ॥ సకలదేశంబుల సన్నుతిగాంచిన
భరతమాతయె యుండఁ బ్రథమసాక్షి,
తరతరంబులనుండి తిరుగాడు స్వాతంత్ర్య
దేవత యుండు ద్వితీయసాక్షి,
ఘోరసంగ్రామసంచారిణి యా మృత్యు
దేవతె యుండుఁ దృతీయసాక్షి,
రసపుత్రశౌర్యవిరాజితంబైన చి
తోడ్దుర్గ మిందుఁ జతుర్థసాక్షి,
తే॥ గీ॥ సరగ జయలక్ష్మి పంచమసాక్షి యుండు
నిట్లు పంచసాక్షులు గల్గు నీకుమారు
కునకుఁ దప్పక స్వాతంత్ర్యము నిడు మెప్పు
డేనియును చితూర్ మీకు స్వాధనమైన॥

ఆ జేయసింగ్జీ! ఇదె నీ పికుమారుని గొంపొమ్ము.

అజే — తండ్రీ! అట్లే చేయుదను. (పోఁ బోవును)

బాదూల్ — (బాలు నెత్తుకొని) కుమారా!

ఉ॥ శూరులు పెక్కు రుండియుఁ బ్రశోభితసూర్యకులంబు నంతకున్
దీరనివంకఁ దెచ్చి రని తేకువఁ బూనకు మయ్య! నీవె హా
ధీరత సంగరస్థలినిఁ ద్రెంచి తురుష్కులఁ గీర్తినొంది చి
త్తూరుపురంబుఁ జేకొనఁగ దుర్గమసీమల కేఁగుచుంటివే॥

(అజేయసింగు, హమీరును నిష్క్రమింతురు.)

భీమ.—రాజపుత్రయోధులారా! మీమీ సదనంబులకేఁగి మీ కాంతామణుల నెల్ల రేపుదయంబున "జోహా" రొనరింపు నట్లాడంబరపుఁడు.

(నిష్క్రమము.)





# రసపుత్రకదనము.

---

[illegible] ము.

ప్రథమరంగము. పద్మినీదేవి యంతఃపురము.

ప్రవేశము-పద్మినీదేవి.

పద్మి—(విచారముతోఁ గూర్చుండి)

ఉ॥ ఆకమలారి నిల్చెరు వియత్తలమందు; సుషుప్తిపొందకే
వ్యాకులచిత్తనై యిటు లపారమనోవ్యథ హెచ్చుచుండఁ ద
జాకరవంశజాతులు యశోంచితమూర్తు లహర్నిశంబులున్
నాకొఱ కుగ్రుశొంచు మరణంబు రణంబున నొందుచుండఁగన్॥

ఆహా! నే నెవ్వరిపాపముమొగంబుఁజూచితినోగాని యెట్టిపల్కులు కర్ణాకర్ణిని దెలియనయ్యెను! దైవమా! ఏల నన్నిట్టిజగన్మోహనాకారినిగా నిర్మించితివి? అన్యసామాన్యస్త్రీవలె జన్మింపఁ జేసిన నన్నానన్యమృగతుల్యుం డగు చక్రవర్తి తనమానస మీనంబును, మద్వీక్షణాంచలములు గాలములుగాఁ గల్గిన మరున కెరఁజేయకుండునుగదా' ఇందఱు రసపుత్రవీరులు క్రోధానలదహ్యదేహులై యీ మనోభవగ్రహావేశుండగు నా తురుష్కనాథుని సైన్యసమేతంబుగా భూతబలి నీయఁ గడంగి యివ్విధి రణనిహతులు గాకుందురుగదా! నిత్యకళ్యాణ సౌభాగ్యవతియగు నీ చిత్తూరుపురలక్ష్మి భవిష్యదాగమ దుర్ద

శావలోకనసంజనితభీతచేతస్కురాలై యశ్రుపూరసిక్త వక్త్రాం
బుజాతయగుట సంఘటింప కుందును గదా! ఈతురుష్క
నాథుండు,

ఉ॥ ఈవిధి నన్యకాంతఁ గని యుత్సుకశాసనసాహసాగ్నికన్
భావము నప్పగించి నృపపాంసనుఁడై పురంబునందు మా
పావనవంశసంభవుల భంగ మొనర్పఁగలాడె? యెప్పుడున్
దైవము దోసకారులకుఁ దద్దయుఁ దోడయి రాకయుండినన్॥

ఆహా! రేయి యనక పగలనక చిత్తూరురక్షణార్థ మీ రస
పుత్రులరి వీరులతో నత్యంతఘోరంబుగాఁ బోరుచుండిరట.
ఔరా! నేనెంత పాపిష్ఠురాల నైతిని!

క॥ రణనిహతులైన భర్తల
మనములఁ దలపెట్టి తత్సహగామనవతుల్ దా
మనిశముఁ గాంతాసాగర
మున మున్గుటఁ జూడనేనె మూలంబుగదా?

ఇందఱు సుందరకామినుల దుఃఖంబునకు హేతుభూతంబ
నగు నాపై నామృత్యుదేవతకైన దయరాదుగదా! అక్కటా!
దురంతచింతాక్రాంతస్వాంతు లగు నా కాంతామణులు
నన్నెంతగాఁ దూరుచుండిరో! ఇట్లనేక మనాథయువతీజన
ప్రదూషితమైన నా సముజ్జ్వలాంగంబు నగ్నియందుఁ బ్రవేశ
పెట్టుట యుచితంబని తోఁచుచున్నయది. అదియునుఁ గాక
సత్యాసత్యము లరయని కుత్సితాత్ములగు ప్రజలచే వ్యాపింపఁ
బడిన దుర్వాదంబును నాకర్ణించుచుండి యెుండినై జీవించుటకన్న
మండుచున్న యగ్నికుండంబులోఁ బడి ప్రాణంబులఁ గోల్పో
యి మత్పాతివ్రత్యంబును వెల్లడింపఁజేయుట తప్ప నాకు
వేరొండుసాధనంబు తెలియకున్నది. (ఆలోచించి) నేను కృత

నిశ్చయురాలనైన నేమి ప్రయోజనము? ఈ ఘోరకృత్యం బొనరించుకొనుటకు మన్నాథుండు నాకనుజ్ఞ నొసంగవలయును గదా! (హృదయమున జేయిడి) చిత్తమా! ఏల నిష్ప్రయోజనంబుగ నాలోచించెదవు.

తే॥ గీ। అగ్నిసాక్షిగఁ బెండ్లాడి యనవరతము
వారిచే సర్వసౌఖ్యముల్ పడయుచుండి
ప్రాణములకంటె ప్రేమానురాగమునను
జూచుకొను భార్యలకు నగ్నిఁ జొరఁగ నాజ్ఞ
నిచ్చువార లె ప్రియభర్త లెచ్చటైన?

(తల పంకించి) అయినను మన్నాథునకు నాకోరిక నెఱిఁగించెదను. నేఁ డేలొకో యర్ధరాత్రింబు గడచినను నాథుండు రాకుండెను? అహః!

ఉ॥ సుప్తి నెఱుంగ డించుకయు సొంపెసలారఁగఁ బల్కఁడింక సం
తృప్తిఁగఁ దా భుజింపఁడు తదేక విచారమనస్కుఁడౌచు ప
ద్మాక్షకులోద్భవాధిపుఁ డహర్నిశముల్ రణరంగమందునన్
దీప్తివహించి శాత్రవులఁ ద్రెళ్ళఁగ నేయ గడంగు నెందిగా॥

శస్త్రాస్త్రవిద్యాపారంగతురాలనై సంయుక్తనలె నాథునకు సహాయభూతురాలనై రణముఖంబున శాత్రవుల నుక్కడంచు భాగ్యంబు నోచుకొనలేదు. ఆహా! నిద్ర యంతకంత కధికమగుచున్నది. (పరుండును)

ప్రవేశము-భీమసెంగు.

భీమ— (విచారముతో)

ఉ॥ ఎంతటిఘోరవార్త వచియింపఁగ నే నిటవచ్చితిన్; గటా
సుంతయు వెన్కదీయఁక ప్రసూనశరీరని నాదుభార్య స

త్యంతశుభోజ్జ్వలాంగిని "రయంబున మండెడు కుండమందు ని
శ్చింతమనస్కురాల వయి చేరు" మటంచు శిలాత్మధారివై!

ఔరా! భీమసింగ్జీ! నీవు పుట్టుకయందె గిట్టిన నిట్టి కష్టములఁ బట్టువడకుందువుగదా! జన్మించినను యే గర్భదరిద్రునియింట జనించిన నిట్టి నితాంతచింతల నొందకుందువుగదా! సురనుతంబైన రాజకులంబున నుద్భవించి యష్టైశ్వర్యాఢ్యుండ వైతివి. అంతేగాని కడుపునిండ కూడును, గంటినిండ నిద్దురయుఁ గల్గియుండు సమయమ్ముఁ గాంచవైతివి. విజయలక్ష్మినిఁ బొందుట దుస్తరంబనియు రాజ్యలక్ష్మి మ్లేచ్ఛులచేఁ బడుట సత్యంబనియు నిరాశాపూరితహృదయుండవై యర్థాంగలక్ష్మి సకలస్త్రీసమేతంబుగా నగ్నిలోఁ బడి యాత్మహత్య నొనరించుకొనుచుండ జూచుటకా యింకను బ్రతికియుంటివి? దైవమా! యింకనైన నదృష్టవంతుండైన భీమసింగున కనుకూలుండ వగుట భరమా? విచిత్రమా! ఇంకను దైవము నీయెడల ననుకూలుండగుననియా తలంచుచుంటివి? ఛీ! ఇంక నాకీ మొండి బ్రదుకేల? (కత్తిఁ బెరికించి)

చ॥ నిరుపమశస్త్రవిద్యలను నేర్చినదానిగ శత్రుసేనలన్
దురమునఁ ద్రుంచుచున్ జయముఁ దోడనె గాంచి భవన్మనంబు సం
బరపడఁ దృప్తి గూర్చితిని బల్మరు; నట్టుల నిప్డు లేదు నా
శిరమును ద్రుంచి తృప్తి నిఁకఁ జెందుము వేగఁ గృపాణరత్నమా!

ఛీ! యేమిరా! తుదకు స్త్రీకృత్యంబునకుఁ దొడఁగితి! నేనిట్లాత్మహత్య నొనరించుకొనిన రాజపుత్రస్త్రీలకు గానున్న దుర్దశ రాకుండునా? వైరులు చిత్తూరుదుర్గంబును వశపఱచుకొనకుందురా? రసపుత్రవీరులెల్లరును తమతమ భార్యలను "జోహా"రొనరించుట కొడంబడునట్లు బుద్ధులు గఱపుచుండిరి. నేనును మత్ప్రియభార్య నందుల కొడంబరచెదను.

(పద్మినీశయ్యకడ కరిగి బాగుగఁజూచి)

సీ॥ అవరోధపద్మాకరాంతరంబున ముకు
ళితపద్మవదనయై సతి పరుండె
దరిగనరాని చింతావార్ధి మున్గిన
హృదయప్లవంబుతో ముదిత యుండె,
ఘోరవిపజ్జలముక్కాదితం బగు
చంద్రాస్య సోముచే సతి పరుండె,
ఘనవిరాశాభయాంకుర మారుతమున వ్రా
లిన లతాంగియటు మానిని పరుండె.
తే॥ గీ॥ గాని యెల్లి సూర్యోదయ కాలమందు
నగ్నికుండమునందు దేహమును డిచ్చు
సంగతి నొకింతయును దెలియంగలేకు
సదయనవసితహృదయ లసచ్ఛరత్రి!

(అని దగ్గర కేగిన పద్మిని లేచి వందనంబు లొనరించి)

పద్మి— నాథా! నేఁడింత యాలస్యముగా నచ్చితిరి. గతం బేమి? ముఖ లక్షణములఁ బట్టి చూడ నేదియో దీర్ఘాలోచనపరులై వచ్చి నట్లుదోఁచెడిని.

భీమ— కాంతామణి! ఈఘోరసంగ్రామ మెల దాపరించెనో గాని (అని విసుకుకొనును!)

పద్మి—నాథా! నా దెంత పాపిష్టిజన్మం బైనది.

సీ॥ నామూలమునఁగదా భూమీధవులుమీరు
కారాగృహంబునఁ గష్టపడిరి,
నామూలమునఁగదా వేమారు చిత్తూరు
పురలక్ష్మి వెతలను బొందవలసె

నామూలమునఁగదా నళినమిత్రకులోద్భ
వులు పెక్కుమంది యాకలనబడిరి
నామూలమునఁగదా నాథులఁ గోల్పోయి
యొంద ఱెందఱో సతుల్ గుందుచుండి

తే॥ గీ॥ తాత ముత్తాతలాదిఁగాఁ దనరుచున్న
రాజపుత్రుల స్వాతంత్ర్యరాజ్యమిప్డు
తురకల వశమునను బడ సరుగుచుంట
కూడ నామూలమునగాదె చూడఁజూడ.

కావున నే దురదృష్టురాలిని బాణిగ్రహణమొనరించుకొన కున్న యిన్నిసిలుగులు సంభల్లకుండునుగదా!

భీమ.— ప్రేయసీ! అట్లనెద వేల? ఇంచుక యోచింపుము.

తే॥ గీ॥ జన్మమొందకె మున్నె కంజజుడు నుదుట
మూడు పంక్తుల లిఖియించి పూర్వజన్మ
కర్మ ఫలమును గుర్తించి కమలనేత్రి!
దాని దప్పించుకొన నెవ్వతరము చెపుమ?

కావున నీసంకటంబు లన్నియు నా పూర్వజన్మకృతిదోష విశేషంబులు గాని నిన్ను నుద్వాహం బొనరించుకొన్నందు వలన దారించ లేదు.

పద్మి.—నాథా! మీరుమన్మానసోపశాంతి కట్లనుచుండిరి గాని నామనో
వ్యధను బోగొట్టికొనుట కొండు సాధనంబు లేకున్న యది.

భీమ.— ప్రాణేశ్వరి! అంతమనోవ్యథ నొందుటకు గారణమేమి?

పద్మి.—నాథా! కారణం బిద్దియని వేరె చెప్పవలయునా? నేనీసుంద
రాకారంబున జన్మించుటయే యిందులకు ముఖ్య కారణము!
అదికాక ప్రజ లేమనుకొనుచుండిరో తెలియదా?

భీమ— ఎవరివిషయమై?

పద్మి— ఈపాపిష్ఠురాలిని గుఱించియే!

భీమ— ఏమీ! ప్రజలు ఏవిషయమై యేమనుకొనుచుండిరి? త్రిలోకసుందరివనియు, సీతాపతివ్రతామణివనియు,

పద్మి— అట్లనుకొను దినంబులు గడచినవి.

భీమ— ఏమనుకొనుచుండిరి?

పద్మి— చెప్పుటకు. గూడ దుఃఖమగు చున్నది. ఇంతకు నాపూర్వఫల కర్మమిట్లుండ నే జేయునదేమి?

భీమ— ప్రేయసీ! ఏల యీ వెడగు మాటలు? ఏ మనుకొనుచుండిరో చెప్పుము.

పద్మి— నేను సుగుణహీనాథుని యుక్తంబైతిననియు సంతట మీరా క్షసుని జయించి నన్నుఁ గొనికొని వచ్చితిరనియు.

భీమ— ప్రేయసీ! దీని కింతగా జింతింప నేల? పలుమాసంబులు నిజనాథుని నామ స్మరణంబే యన్నపానంబులుగా గడపినట్టి మహాపతివ్రతయగు సీతామహాదేవి విషయమై జను లింతకంటె నెక్కుడు వదంతిని వ్యాపింపఁజేయలేదా?

పద్మి— నాథా! అందులకు శ్రీరాములవారేమి ప్రతిక్రియ నొనరించిరో యెఱుంగరా? భార్యనుఁ బరిత్యజించెను. నాకనుజ్ఞ నిచ్చినచో నే నీ పాపిష్ఠిజన్మంబును ద్యజించెదను.

భీమ— (తనలో) నే వచ్చినపనియు నీపె కోరికయు నొకటియే యయినది. (ప్రకాశము) ప్రేయసీ!

మ॥ పరిహాసంబున కైన నిట్టి పలుకుల్ పల్కంగ నుంకించ వీ

తఱి నామూఢుల దుర్వదంతిని తనూత్యాగంబు పోఁగొట్టునే?

సరి లే; నిన్నుఁ బరిత్యజించిన భువిన్ సౌఖ్యంబు వే రెద్ది; హా!
సరసీజాక్షిరో! యిట్టియుద్యమ మికన్ జాలింపుమా యింతటన్.

మఱియు.

సీ॥ చాల నానందాబ్ధి నోలలాడఁగఁ దన
యర్ధాంగియే తెప్పయగును సతిరో!
వారిమహాలన వర్ధిల్లుటకుఁ దన
యర్ధాంగి పట్టుకొమ్మగును సతిరో!
భువిని మోహమ దేభమును మరల్పఁగ దన
యర్ధాంగి యంకుశంబగును సతిరో!
సకిలార్థ కామమోక్షముల నొందఁగఁ దన
యర్ధాంగి సాధనంబగును సతిరో!
తే॥ గీ॥ కాన నర్ధాంగివిడనాడి మానవుండు
జగతి నే సౌఖ్యమందఁగఁ జాలు చతివ!
భార్య లేనట్టిమగవాని బ్రతుకుకంటెఁ
గష్టజీవన మిక వేరు కలదె చెపుమ?

కావున నేల నీవు కాయంబును బాసి నన్నుఁ గష్టములఁ బాల్పడఁ జేసెదవు?

పద్మి—అయిన నో ప్రాణకాంతా! పురుషున కెట్టి సంకటములు గలిగినను నవి భార్యవలన నేకదా కలుగుచున్నవి.

భీమ—తరుణీ! అట్లనెద వేల! సుఖదుఃఖంబుల నందునపుడు సతీపతు లిరువురును సమానులే గాని యందునొకరివలన నొకరికిఁ గలుగు నను మాట కల్ల.

పద్మి—ఇదంతయు నేల? నే నీదుర్వార్తను వినుచు మనజాలను. అగ్ని ప్రవేశంబొనరించి యీదుర్వార్తను నిర్మూలించెదను. నా కాజ్ఞ

నొసంగుచున్నది. హా! రాజపుత్రస్త్రీలారా! మిమ్మెల్లర విడనాడు కాలము నా కాసన్నంబయినది.

భీమ—(తనలో) నేనచ్చిన కార్యము నెఱవేర్చుకొనుట కిదే సమయము. (ప్రకాశము) కాంతామణీ! రాజపుత్రస్త్రీల విషయమిట్టి పోదువను చింతవలదు. వారెల్లరు నీతోఁగూడ "జోహార్" గావించెదరు.

పద్మి—(భయాశ్చర్యములతో) నాథా! నాహితంబున వారెల్లరు "జోహారు" గావింతురా?

భీమ—సతీమణీ! హితంబున నెట్లగును? పరాధీనుల మని పేరు నొందిన వారిజాప్తకులోద్భవులే యిందుకుఁ గారణభూతులు.

ఉ॥ వైరులు కోటఁ బట్టుకొనువారని నిశ్చయమంది వారలన్
బాలురఁ గాఁచలేక తమ భార్యలు మ్లేచ్ఛుల చేతఁ జిక్క తా
మారసి జేసి రొద్దినులగు చందనగిలారవమానసముంచు "జౌ
హా"రొనరింపఁగా సతుల కాజ్ఞ నొసంగిరి రాజపుత్రకుల్॥

పద్మి—నాథా! ఇందుకే రాజపుత్రస్త్రీల కెట్టిదుస్థితిఁ జేకూర్చెదరే!

భీమ—తరుణీ! నీ విట్లు మనయెడలఁ బ్రతికియున్నను నిట్టి దురవస్థ రాకుండునట్లు?

పద్మి—నాథా! యిట్లు స్త్రీలానందముతోని నశింపఁజేయ గడంగితిరి గదా. ఒకవేళ దైవ మనుకూలుండై మిమ్ము విజయోన్ముఖులఁ జేసిన నేమి చేసెదరు?

భీమ—యువతీమణీ! యింకను మనకు విజయము చేకూరుననియా తలంచుచుంటివి. చేకూరిన నేమి?

తే. గీ॥ భార్యలు గతించినను వేరుపడతులను వి
వాహమాడంగవచ్చును వారిజాక్షి

లకవమానంబు సంఘటిల్లఁగల దేని
మరల మానంబుఁ గొనుట దుస్తరముగాదె॥

(తెరలో ఢక్కా మ్రోగింపఁబడును.)

భీమ—ప్రేయసీ! మూడవ యామము గడచి నాలుగవ యామమారం భించినదని తెలియఁజేయు ఢక్కా మ్రోగింపఁబడుచున్నది. ఇఁక గొన్నిగడియలకు మనకు వియోగకాలం బాసన్నంబగును. భవదీప్సితం బొసంగితిని.

పద్మి—తే॥ గీ॥ ఏఁ గృతార్థురాల నయితి నింక మీగు
ముదములో నేఁ గృతజ్ఞతాపూర్వకముగఁ
జేయుచుంటి నమస్కృతుల్ స్వీకరించి
నన్ను నాశీర్వదింపుడీ సన్నుతాంగ॥

భీమ—ప్రేయసీ! రాజపుత్రస్త్రీలు జోహారొనర్చుటకు సిద్ధముగ నుందురు. నీవును సిద్ధముగ నుండుము. ఇఁక నేను నిష్క్రమింతెదను. (భీమసింగు నిష్క్రమము.) (యవనిక వ్రాలును.)

---

ద్వితీయరంగము. 'జోహారు'

(ప్రవేశము) భీమసింగు, లక్ష్మణసింగు, బాదూల్ సింగు, విక్రమసింహుఁడు, మఱికొందఱు రసపుత్రయోధులు.

భీమ—రాజపుత్రయోధులారా! రాణా! లక్ష్మణసింగ్జీ!

చ॥ అలరఁ బతివ్రతామణు లటంచు ద్రిలోకములందు సంస్తుతిం
బొలుపుగఁ గాంచి మించు రసపుత్రకులాంగన లెల్ల దుర్దశా

కలితహృదంబుజాత లయి క్రన్నన మన్ననతోఁ గృశానుకీ
లల బడనుండి రిప్డని కలంగకుఁడీ విధివ్రాత దప్పునే ?

లక్ష్మి—భీమసింగు మహారాజా! తదితరస్త్రీజనవిషయమై కలుగు
దుఃఖంబున కేమిగాని,

సీ॥ చంద్రబింబము నిస్తంద్రప్రభాసాంద్ర
మందె నే యువతీముఖాంబుజమున
నిరతపాతివ్రత్య మురుధనంబై స్థిరం
బయ్యె నే తరుణీహృదంబుజమున
రమణించు దానధర్మమ్ములు నిలిచె నే
లలితాంగి హస్తపల్లవములందు
సతిసాధుశీలంబు నుతికెక్కె యమరె నే
నలినాక్షి మందయానంబునందు

తే. గీ॥ ధరణిఁ గమలాలయోపమ గరిమఁ గాంచె
నేసతీమణి ప్రియవచశ్రీసమితిని
నట్టి మామాత పద్మినీ పట్టమహిషి
కాలుచిచ్చున బడ నోర్వఁగలమె చెపుడీ॥

(తెఱలో)

తే॥ గీ॥ మంగళస్నాతలై శుభమంగళంబు
దెలుపు వాద్యసమేతలై స్త్రీసమూహ
మతిముదంబును జెంది జోహారొసర్ప
నచ్చుచుండిరి నిర్జరుల్ మెచ్చుచుండ॥

భీమ—(విచారముతో) హా! స్త్రీజనంబులారా! మిమ్మెల్లర నింతదుర
వస్థపొంత, జేర్చిన యీ భూకాంక్షునకు సుగతిగలదా? (దూర

ముపరికించి) రాజపుత్రవీరులారా! ఏమీ చిత్రము? ఇక్కడవల యపతి తురుష్కుల నుక్కడింపలేక రాజపుత్రకులాంబురుహా స్యలనెల్ల సంతాప దుర్మరణముపాలొనర్ప సిద్ధుండయ్యె నని యానిత్యుండు నిద్రక్రోధాగ్నిని సహస్ర ధాముండై యేలకో నాపయి దండెత్తి వచ్చుచున్నట్లు గోచెడి.

బాదూల్—రాజేంద్రా! ఏల భ్రమనుపడెదరు? ఆ వచ్చువారు రాజ పుత్రాంబురుహాననలు గారా?

భీమ—ఏమీ చోద్యము! ఈతండు సదాగతుండయ్యె దళ్లితా ననలనెల్ల వాయుసఖున కాహారంబొసంగునట్లు నిశ్చితుండయ్యె నని మేఘనాథుండు పంపఁగా సహస్రరూపంబులు దాల్చిన క్రోధాగ్నిదేవతాహస్తాంబులయందు ప్రకాశించు ఖడ్గసహస్రంబు నాపయిం బడవచ్చు చున్నట్లున్నది.

విక్ర—రాజా. యేమి మీ యిచ్ఛపాటు. ఆ వచ్చునవి రసపుత్రాంగనా శ్రేణిగదా.

భీమ—ఆహా! ఈ యస్థాంగలక్ష్ములకెల్లరకు దుర్మరణంబు సేకూర్ప నున్నరాజపుత్రులనెల్ల శిక్షించుటకు యమనాశనీయుండైన శిఖికం ఠుండు పంపిన నిటలనేత్రాగ్నిజ్వాలలు మనపైవచ్చుచున్నవి.

లక్ష్మ—రాజా! ఆ వచ్చువారు సకలసువర్ణభూషణభూషితాననలగు రాజపుత్రాంగనామణులు గదా.

(ప్రవేశము) పద్మిని, మఱికొందఱు రాజపుత్రస్త్రీలు.

భీమ—హా! యువతీమణులారా! మీ రందరు జోహారొనర్చుచుండ జూచి మేమెట్లు సహించగలము? (పద్మినీదేవిని సమీపించి హా! పద్మినీ!

సీ॥ దేదీప్యమానమందిరవాసినీ! నీవు
చీకటిగవులలోఁ జేరుటెట్లొ?
మృదులశయ్యలపైని సుఖనిద్ర జెందెడు నీవు
నిప్పుల చితిపైన నెలయుటెట్లొ?
హిమకరకిరణబాలుకుల నిల్చెడు నీవు
ఘోరానలంబున గ్రుంగుటెట్లొ?
ఘనవిశేషంబు నాకు సర్ధాంగివౌ నీవు నన్
విడనాడి కినుకవసి వెడలుటెట్లొ

తే॥ గీ॥ సముదయరితకళింక సంకటము మున్గి
పుడమి నే నిడుములు నొంది యడలుచుండ
ముందుగా నీవు పోయి యాముష్మికంబు
నొంది సౌఖ్యంబు లందుచు నుందు టెట్లొ?॥

పద్మి— నాథా! సకల మెఱింగిన మీరలే యిట్లు వికలప్రాజ్ఞులవలెఁ బల్కుచుండ నే నేమి పేర్కొనఁగలను? నిశ్చలత్వం బొందిన నా మానసంబును గ్రమ్మఱఁ జలింపఁ జేయకుండునట్లు ప్రార్థింపుచున్నదాన. ఇఁకమాకీభూమ్యంతరనిర్మితంబులగు గుహలలోఁ జొరసనుజ్ఞనిండు. కాలంబతిక్రమించుచున్నది. వైరులు దుర్గంబునఁ బ్రవేశించిరేని మాకు బ్రమాదము సంభవించును.

భీమ— ప్రేయసీ! ఈ ఖలుం డింకులకు మాత్రము సిద్ధుండై యున్నాఁడు.

పద్మి— మనోహరా! నమస్కారములు (పాదములపైబడి లేచును)

(పద్మినిమొదలగు స్త్రీలెల్లఱు నిబద్ధాంజలులై)

పద్మి—

* దండకము *

శ్రీమజ్జగన్మిత్రవంశాబ్ధి సంభూతురాణ్ణిందిరాసుందరీరత్న పాదాంబుజధ్యాన పీయూషపాన ప్రమత్త ప్రచిత్తుల్సదా దివ్యచారిత్ర లత్యంత మానాభిమానాఢ్య నిత్యవ్రతస్ఫూర్తి వర్తించువారల్ జగన్మోహనాకారిణుల్ పెక్కువర్షంబులం బొట్టి యూరోజుదారుల్ విదేశీయులై ముష్కరాధ్యక్షులౌ మ్లేచ్ఛసైన్యాళిచే మానభంగార్తి నెక్కింతయుం జెందకున్నార లిన్నాతురుష్కాధినాథుండు దుర్గంబు భగ్నంబు గావింప యత్నించి, యుందగ్ధభాగంబు నాశంబుగావింపనా వొప్పువీక్షించి యాదిత్యతుల్యప్రదీప్తప్రదుల్ రాజపుత్రాఖ్యులింకెట్టులైనన్ బరాభూతులై కోట మ్లేచ్ఛాళికిన్ జిక్కఁగాఁబెట్టి కాంతామణుల్ మానభంగంబు నొందంగలారంచు మమ్మెల్ల జోహారొనర్పంగి నాజ్ఞాపనంభీయ మేమెల్ల నిప్పట్టునన్ సేమహా కీలలంజొచ్చి యశ్రాంతవిశ్రాంతకీర్తిన్ వహింపంగ నేతెంచి నామిప్పుడీ వెంతయున్ వీరలాదిత్యవంశంబునం బుట్టిరే యంచు విస్తారహాజాలిపై శీతలంబౌచుఁ బోకింకనిన్నెక్కుడౌ భక్తిపై ప్రార్థనల్ చేతు మోపావకా! వీతిహోత్రా! నమస్తే నమస్తే నమస్తే నమః (అందఱు గుహలోఁ బ్రవేశింతురు).

విక్ర—(మండుచున్న కొఱవులుఁ పుచ్చుకొని) రాణా! ఇంక మీరీ చితుల కగ్ని నంటింపుడు (భీమసింగునకు కొఱవుల నిచ్చును.)

భీమ—(కొఱవులఁ బుచ్చుకొని) ఔరా! ఏమీ కాలమాహాత్మ్యము. స్వపరిపాలనస్థితానేక దాసదాసీజనయాచక మంత్రి చమూ

పురోహితశాంధవాదరణస్ఫూర్తి వెలయునీదక్షిణహస్తంబుతుద కుసకలరాజపుత్ర సమేతంబులయిన చితులకు నగ్ని నంటించుట కుపయోగింపఁబడ వలసివచ్చినది. హా! వివిధశస్త్రాస్త్రవిద్యాభూషితంబై దుర్మదరిపు కుంభి కుంభచ్ఛేదిన సాధనంబగు కరవాలంబుధరియించు నీదక్షిణహస్తంబు చివర కబలలచే నిండి యుండిన చితుల వెలిగించుటకునియోగింపఁ బడవలసి వచ్చెను. హా! విధీ! ఎంత రెమొనర్చితివి! (చితుల నంటించును. రాజ పుత్రు లొక పెద్ద బండ నాగుహాద్వారంబున కడ్డము వేతురు.)

భీమ—

* దండకము *

శ్రీ నజ్జగన్మిత్రవంశాబ్ధిరాకాసుధాధాము లౌ పూర్వరాజాత్మజుల్ నిన్ను నభ్రంకషోత్తుంగ ధాత్రీధరవ్రాతముల్ జుట్టునుం గల్గియున్నట్టి పీఠస్థలంబందు నిర్మించి ఘోరారిహృద్భీకరంబౌ యఖాతంబు త్రవ్వించి తత్రాంతమందున్ విశాలోన్నతప్రౌఢి వర్తించు ప్రాకారముల్ గట్టి యట్టాలకంబుల్ బలిష్ఠంబుగాఁ గట్టి చోద్యంబుతో గొప్ప ప్రాసాదముల్ దివ్యదేవాలయంబుల్ ఘనాగారముల్ శస్త్రవిద్యా గృహంబుల్ మహాలీల నిర్మించి నానారిపుక్ష్మాతలాధీశులన్ సంగరక్ష్మాతలిన్ వేబరాభూతులం జేసి యాంశాంతవిశ్రాంతకీర్తి ప్రపూర్ణాత్ములై నిన్నుఁ బాలించి నారిప్పుడీ భూతలాధీశుడుత్తుంగ శౌర్యంబు వర్ణించి శత్రుక్షమానాథు సైన్యాళిఁ దన్నాడగాఁ జాల కిట్లంగనారత్న సంఘంబు నొక్కుమ్మడిన్ ఘోరదావానలంబందు దేహంబులర్పింపఁగాఁజేసి నీరక్షణార్థంబు హస్తంబులందున్ వెసన్ ఖడ్గముల్

బూని మేమెల్ల సంగ్రామరంగస్థలిఁ శత్రులఁ గూల్చుటో లేక యవ్వారిచేఁ జచ్చుటో రెంటిలో నెద్దియో నిశ్చయంబంచు యోజించి యొక్కుమ్మడిఁ శత్రులఁ మార్కొనఁ బోవఁగా నుంటి మింకఁ మమున్నీకృపాదృష్టులంజూచియుఁ గ్రమ్మఱఁ మేము నీప్రాపునందుండి సంతోషముం జెంది నిందృపుత్రాలిఁ దగం జేయ మమ్మెల్ల దీవింపుమా! కాచి రక్షించుమా! దుర్గలక్ష్మి చితోడ్ దుర్గలక్ష్మి నమస్తే నమస్తే నమస్తే నమః

(ప్రవేశము) తురుష్క సైనికులు.

(రసపుత్రులకుఁ దురుష్కులకు ఘోరయుద్ధంబు జరుగును. రసపుత్రు లెల్లరు నశింతురు. తురుష్కులు కోట నాక్రమించుకొనెదరు.)

(తెర పడును.)




చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

# తారీఖులజంత్రి వడ్డీజంత్రి.



1 ఇందు గతసంవత్సర 1867 సరియైన ప్రభవ సంవత్సరం మొదలు రాబోవు 1939 సంవత్సర ప్రమాదిసంవత్సరమువరకు తెలుగుసంవత్సర మాసతిథులకు సరియైన ఇంగ్లీషుసంవత్సరముల నెల తేది వారములను తెల్పునదియై యున్నది.

2 ఇందు రు 1-0-0 మొదలు 5 వందలరూపాయలవరకు నెల 1 కి రు 0-4-0 లు మొదలు రు 2-0-0 లు వరకు రోజుకు నెలకు సంవత్సరముకు అసల్వడ్డీ జంత్రియున్నది,

3 నెల 1 కి 4 అణాలు మొదలు 2౦ రూపాయలువరకు ఇండ్ల అద్దెలు కూలీల మస్తర్లు జీతములు వగైరాలు 28, 30, 31 రోజులుగల నెలలలో రోజుకు ఎంతఅయ్యేదిన్ని మొదలగు సంగతులు తెలుపు జంత్రియున్నది,

4 కరణములకు ఉపయోగించులాగున ఎకరా 1 కి 0-1-0 మొదలు 20 రూపాయలవరకు 100 యకరములవరకు అయ్యే శిస్తుయొక్క సెంట్లు ఉద్దేశ ప్రకారముగా 100 సెంట్లవరకు అయ్యే మొత్తమున్ను, రోడ్డు విలేజి లోకల్ఫండ్లు జంత్రి తెల్పును. ఆదినుంచు విధము నాటియందే వ్రాయబడియున్నది.

5 వస్తువు 1 కి పైసా మొదలు 1 రూపాయలవరకు 100 వస్తువులవరకు అయ్యే మొత్తమును, క్రొత్తగా అమలులోకివచ్చిన, పోస్టేజి వగైరాలును రిజష్ట్రేషను ఫీజులు, కోర్టు స్టాంపుడ్యూటీ, మొదలగు సంగతులు తెలుపును.

ఇప్పటికి 4000 పుస్తకములు ఖర్చుఅయినవి.

వెల పోష్టు ఖర్చులు సహా రు 1-10-0 లు మాత్రం

వలయువారు :—

జి. సేతుమాధవరావు బ్రదర్సు,
గుంటూరు

(అని వ్రాయవలెను.)